# ★ బా పూ జీ ★

...గ్రంధాలయము

గ్రంథకర్త:

విద్వాన్ చిట్టా రామకృష్ణరావు బి. ఎ., బి. ఇడి.
అధ్యాపకుడు,
యల్. యమ్. హైస్కూలు,
గుత్తి. (అనంతపురం జిల్లా)

1345

PRINTED AT
THE HIGH SCHOOL PRESS, GOOTY.

సర్వస్వామ్యసంకలితము] [వెల రూ. 0-12-0.

# విజ్ఞప్తి

—○—

శ్రీ గాంధీమహాత్ముని మహోత్తర జీవితమును సంగ్రహముగ రచింపవలయునను కోరిక పొడమినది. వీలైనంత రసవంతముగ దానిని చిత్రింపవలయునని మాసక్తి ప్రజ్వరిల్లినది. భక్తితో ఆపనికిఁ బూనుకొంటిని.

సాహిత్యమునకుఁ గొంత సంగీతము కూడ సమ్మిళితము చేసినచో నా పూనిక కొంతవఱకైన కొనసాఁగఁగలదని తలంపు గలిగినది. ఏలయన సాహిత్యము క్షీరము వంటిది. ఇఁక సంగీతము సాక్షాత్తు శర్కరయే. అట్టి యీ రెంటి యొక్క సహవాస విశేషము నెవరు కాదనగలరు? అందుచే నా చిన్ని కావ్యకుమారికి చిన్న చిన్న మాటలతో పాటుగ కొన్ని పాటలను పద్యములను గూడ నేర్పయత్నించితిని. ఇందు నా యత్నమెంత వఱకు నెఱవేరినదో నిర్ణయింపఁజాలను. ఆ విషయమును పాఠక మహాశయులకే వదలివేయుదును. దీనిని సరియగు సంగీత సాహిత్య సమ్మేళనముతో పఠించియు, శ్రోతలకు వినిపించియు, రసజ్ఞులు నా కృషిని సార్థకపఱతురని విశ్వసించుచున్నాను. మహాత్ముని జీవిత కథను విశదీకరించి చెప్పుచు పోయినచో కనీసము మూఁడు గంటల కాలమైన శ్రోతలకు వినిపింప శక్యము కాఁగలదు.

ఈ కబ్బమును కడు శ్రద్ధాభిమానములతో ముద్రించిన యల్. యమ్. హెచ్. యస్. ముద్రాక్షరశాలాధికారులకు నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

ఇట్లు,

చిట్టా రామకృష్ణరావు,

గ్రంథకర్త.

శ్రీరస్తు

సీ॥ వేదశాస్త్ర పురాణవేది సీతారామ
ధార్మికుం డెవని పితామహుండు।
ఆంగ్లవిద్యాభ్యాసి యతిశాంతమూర్తి నా
గేశ్వర విఖ్యాతుఁ డెవని తండ్రి।
వాత్సల్యనిధి గృహ పాలిభవోపేత ల
క్ష్మీ నరసాంబ యెవ్వాని జనని।
గణిత సాహిత్యముల్ వినతుఁడై సేవించు
నుదుత సద్భక్తి నెవ్వాడు ధరిత్రి।

గీ॥ అట్టి చిట్టా గృహాభిధానాన్వితుండు
రామకృష్ణాహ్వయుండు సుప్రేమ చెలఁగ।
నొనఁగు బాపూజి సత్కథా ప్రసవ మిపుడు।
దీనిఁగొనుడయ్య బుధులార! దివ్యులార!

శ్రీరస్తు

# ★ బాపూజి ★

★

## మొదటి ప్రకరణము

తో॥ శ్రీకరముగ మహాత్మ్మగాంధికథ చెలువుగ వినుడీ జనులు।
ప్రాకటముగ భువి ధర్మ్మరాజ్యమునుబడసి సుఖింపుడీ ఘనులు॥
లోకములోన శోకము బాపగ నేకరణిని సర్వంబున్।
ఆకరుణాళుం డోసగి తరించెనో యాకర్ణింపుడి నరులు॥
శాంతము లేకను సౌఖ్యము లేకను స్వాతంత్ర్యము లేకన్।
స్వాంతములోన కుందెడు జనులకు స్వారాజ్యంబును జూపెన్॥

సీ॥ ఏ మహాత్ముని దివ్యనామ రూపక్రియ
లిలయందుఁ బండువెన్నెలలఁ గురిసె।
ఏ ధర్మవీరుని యెనలేని ధైర్యంబు
పరజాతి క్షాత్త్ర్యంబు పారద్రోలె।
ఏ శాంతిదూత యహింసా విధానంబు
మరఫిరంగులనెల్ల మరగుపరచె।
ఏ సిద్ధసంకల్ప భాసురోద్యమ ధాటి
భారత స్వాతంత్ర్య భాగ్య మొసఁగె।

గీ॥ అట్టి సుగుణైక కంధి మహాత్మగాంధి
దివ్యగాథామృతము గ్రోలి భవ్యగతిని
సర్వతోముఖ మాతృదేశ ప్రతిష్ఠ
గనుడి బుధులార! రసికాగ్రగణ్యులార!

తే॥ రహిమించిన గుజరాతురాష్ట్రి పోర్బందరు సంస్థానమునఁ ।
మహితాత్ముఁడు గాంధీజి జనించెను మానవ రూపముతోడన్ ॥
తల్లి పుత్తలీబాయి నిష్ఠయును దైవభక్తి పెంపొందఁ ।
సల్లలితంబుగ నుల్లమలర వ్రతచర్యల సల్పుచునుండెన్ ॥
తండ్రియైన కాబాగాంధీ సంస్థానపు మంత్రిగ నుండెఁ ।
తండ్రివోలె జనసంతతి నాతఁడు ధర్మంబుగ పాలించెఁ ॥

వ॥ అది శుక్లనామ సంవత్సరము. భాద్రపద మాసము. బహుళ ద్వాదశీ శనివారము. అనగా క్రీ. శ. 1869 వ సంవత్సరము అక్టోబరు రెండవ తారీకు. ఆ పుణ్య దినమున గాంధీజీ జన్మించెను. ఆయన పూర్తిపేరు మోహన్‌దాస్ కరంచంద్ గాంధి. గాంధి యనునది వారి యింటి పేరు. ఆ పదమునకు కథెయవాడ్ దేశములో పచారుదినుసు లమ్మువాఁడని యర్థము. అనగా గాంధీజీ వైశ్యకుల సంభూతు డన్నమాట.

గాంధీజీ యేడేండ్లవాఁడై యున్నపుడు ఆయన తండ్రి రాజకోట సంస్థానమునకు న్యాయమూర్తిగ మార్చబడెను. గాంధీజీ అచ్చటనే ప్రాథమిక పాఠశాలలోను, మాధ్యమిక పాఠశాలలోను, విద్యను పూర్తిగావించెను. పిమ్మట తన 12 వ యేట ఉన్నత పాఠశాలలోఁ జేరెను. అంతటి చిన్నవయస్సులో గూడ ఆయన

గీ॥ గురులతోఁ గాని తోడిబాలురకుఁ గాని
హాస్యమునకైనను నబద్ధంబు లాడడెపుడు,
పాఠములు శ్రద్ధతో నేర్చి, బడికి వేళ
తప్పకుండగ నేగుచు నొప్పు నతఁడు ॥

వ॥ అట్టి సత్యసంధులు కార్య దక్షులు జనులలో నెందరుందురు? అట్టి ఉన్నత గుణములను బట్టియే ఆయన మహాత్ముండైనాడు. అందును అంత చిన్నవయస్సులోనే అట్టి సద్గుణము లుండుట యెంతో గొప్ప విశేషము కదా.

ఆయన ఉన్నత పాఠశాలలో చదువుకొను కాలమున ఒక విచిత్ర సంఘటనము జరిగెను. ఒకనాడు విద్యాశాఖాధికారి బడి తనిఖీకి వచ్చెను. ఆయన గాంధీజి ఉన్న తరగతికి కూడ వచ్చి కొన్ని ఆంగ్ల పదములు చెప్పి, బాలురను వ్రాయుడనెను. అప్పుడు గాంధీజి ఒక పదమును తప్పుగా వ్రాసెను. అది ఉపాధ్యాయుడు చూచి, ప్రక్క పిల్లవాండు వ్రాసినది చూచి వ్రాయుమని సైగ చేసెను. కాని అది పాఠము బోధించు సమయము కాదు కదా. కేవలము పిల్లల సామర్థ్యమును గమనించుటకు చేయబడు తనిఖీ కదా. అట్టి సందర్భములో పొరుగువాని వ్రాతను జూచి వ్రాయ వచ్చునా? అందుచే గాంధీజీ అందుకు సమ్మతింపక స్వంతముగనే వ్రాసెను. ఆ వయసు పిల్లలెందరంతే ధర్మబుద్ధితో నుందురు? ఈ విధముగ గాంధీజీ చిన్నప్పటి నుండియే ధర్మదీక్ష నెక్కుడుగ ప్రదర్శించెను. పువ్వు పుట్టగనే పరిమళించు ననుమాట నిక్కము చేసెను.

హరిశ్చంద్ర నాటకము నెందఱు చూచుటలేదు? వారి కందఱికి సత్యప్రియత్వ మెక్కువగుచున్నదా? కాని గాంధీజీ కది నిజముగా సత్యదీక్షను వృద్ధిచేసెను. అట్లే శ్రవణు డనువాని నాటకమును ఆయన కెక్కువ మేలుచేసెను. ఎట్లన, అది ఆయనలో నున్న పితృభక్తిని యెక్కువ చేసెను.

పాపము! గాంధీజీకి ఆయన తండ్రి 12 వ యేటనే వివాహము చేసెను. ఆయన అన్నకును ఆయనకును కలిపి ఒకేసారి చేసినచో ఖర్చులు చాలవరకు కలసివచ్చునుకదా. అందుచే ఆయన యిరువురికిని కలిపి ఒకేసారి పెండ్లి ముగించెను. కాని గాంధీజీకి అంత చిన్నవయస్సులోనే పెండ్లి యన్ననేమో తెలియగలదా? అప్పుడు ఆయనకు బాగుగ తెలిసిన దేమనిన

గీ॥ పిండివంటలు మెసవుట, విలువగలుగు
వస్త్రములదాల్చి తిరుగుట, బడినిమాని
భార్యయైనట్టి నూతన బాలతోడ
నలయకెల్లప్పు డాటల నాడుకొనుట ॥

వ॥ ఇవియే అంత చిన్నవయస్సులో గాంధీజీకి బోధపడినవి. ఇంతేకాక యింకేమేమి ఆయనకు బోధపడినవనగా 'వివాహం విద్యా నాశాయ' అను నార్యోక్తి బాగుగా బోధపడెను. ఏలయన ఆయనకు ఆ వివాహము వలన ఒక సంవత్సరము విద్యాభ్యాసమున ఆటంకములు కలిగెను. అందువలన తరువాత ఆ లోటును పూర్తిచేసికొనుటకు ఆయన భగీరథ ప్రయత్నము చేయవలసి వచ్చెను. అనగా ఆయన చాలకష్టపడి రాత్రింబవళ్ళు నిద్రాసుఖములు మాని చదువవలసి వచ్చెను.

అయితే ఆకాశమున వెలుంగు ఆ ప్రజ్వాల చండభాస్కరుని గూడ ఒక్కొక్కప్పుడు మేఘమాలికలు అడ్డుపడజూచును గదా. ఆయన ప్రచండ కాంతికి కొంతభంగపాటు కలిగింప యత్నించును కదా. అటులనే గాంధీజీని కూడ కొన్ని దురభ్యాసములు వలగొని

లోఁబరచుకొన జూచెను. ఆతని దివ్యపవిత్ర జీవితమునకు కొంత కళంకము గలిగింప యత్నించెను. అది యెట్లన, నొకమిత్రుని వలన నాతని నవి సమీపించెను. లేకున్న నవి ఆతని చెంతకు చేరుటకైన నవకాశము లేదు. ఇంకెవ్వరైన సామాన్య బాలకుఁడైనచో ఆ దురభ్యాసములలో పూర్తిగపడిపోయి, వాని వలన పూర్తిగ చెడిపోయెడివాడే. కాని గాంధీజీ అట్లుకాలేదు. అదియే ఆయనలో నున్న గొప్ప విశేషము. అదియే ఆయనకును యితర సామాన్య బాలకులకును గల భేదము. ఆయన యేమిచేసెను? తన దృఢమైన మనోబలముచేత, తన పవిత్ర వర్తనముచేత ఆ దురభ్యాసముల ఆక్రమణమునకు అంతగా లోబడక, త్వరలోనే వానిని తన నుండి పాఱద్రోలినాడు. వాని నుండి విముక్తుఁడై మేఘమండలము నుండి విడివడిన చండభానుని పగిది వెలుగొందినాడు. అట్టి దేదీప్యమానమగు పవిత్రదీక్ష కలవాడు కావుననే ఆయన పెద్దవాడైన తరువాత కూడ అట్టి పవిత్ర వర్తననే కలిగియుండి, మహాత్ముఁడను బిరుదును బడయగలిగినాడు. యావత్ప్రపంచము యొక్క ప్రస్తుతిని పొందగలిగినాడు. ఆయననంత చిన్న వయస్సులోనే పట్టి బంధింప వలెనని ప్రయత్నించి తుదకు ఆయన చేతనే జయింపబడిన ఆ దురభ్యాసముల గాథ యేమనిన:

సీ॥ మాంసంబుఁదిన నొక్కమాయ మిత్రుఁడు నేర్ప
దానిని వేవేగ మానుకొనియె।
వేశ్యయింటికి నొక్కవెంగలి గొనిపోవ
కాంతకు మ్రొక్కి దుఃఖమున మఱలె।

ధూమపానము సేయు దుష్టుడొక్కఁడు చూపఁ
దండ్రికి తన తప్పు తానె తెలిపె।
దొంగతనము సేయు దోషంబుగా నెంచి
తనకుఁ దానుగ దాని తలపు విడచె।

గీ॥ కలరె బాల్యంబుననె యిట్టి కలుషములను
దన యపార మనోబల ఘనతచేత
పారద్రోలియు మాన్యత జూరగొనిన
యట్టిగాంధీజిబోలు మహాత్ము లరయ ?

వ॥ ఇంతేకాదు. ఆ మహాత్ముడు తన చిన్ననాటనే చూపిన యితర మహనీయ గుణము లేమనిన

సీ॥ తన తప్పులకుఁ దండ్రి దండింపమిని జూచి
తా నహింసా మహితత్వ మెఱిఁగె।
తల్లి చేసెడు నిత్య దైవపూజలఁగాంచి
యఖిలేశు భక్తి తా నభ్యసించె।
తండ్రితో నన్యమతస్థుల నుడులెంచి
సర్వమతంబుల సమత గనియె।
వర ధర్మమార్గమే ధరణి మేలని నమ్మి
ధర్మనిర్వాహణ సాధన మొనర్చె।

గీ॥ ఎందఱట్టి పరిస్థితులందు మనియు
నభ్యసింపఁ గలారు మహాత్ము వోలె ?
పువ్వుపుట్టగనే తావి పొలయు ననెడు
పగిది గాంధీజి బాల్యంబు భవ్యమయ్యె॥

వ॥ గాంధీజీకి 18 యేండ్ల వయస్సున తండ్రి యగు కాబాగాంధి స్వర్గస్థు డయ్యెను. అప్పటికి గాంధీజీ యెంతవరకు చదివెను ? మెట్రిక్యులేషను పరీక్షలో కృతార్థుడయ్యెను. తరువాత యేమి చదువుకొనవలెను ? బంధుమిత్రులు ఇంగ్లాండుకు పోయి బారిష్టరు చదువు చదివి రమ్మని సలహా యిచ్చిరి. ఇంగ్లాండుకు పోయిన వారికి సర్వసాధారణముగ అచ్చటి ఆచారమునుబట్టి మద్యము, మాంసము తప్పనిసరిగ అలవాటగును. అందుచే పవిత్ర హృదయయగు గాంధీజీతల్లి మద్యము, మాంసము, మగువ అను నీ మూడింటిని అచ్చట ముట్టనని త్రికరణశుద్ధిగ ప్రతిజ్ఞ చేసినచో ఇంగ్లాండుకు పోవచ్చునని అనుమతించెను. అట్లే త్రికరణశుద్ధిగ వర్తింతునని ప్రతిజ్ఞచేసి గాంధీజి ఇంగ్లాండు కేగుటకు సిద్ధపడెను. కాని ఆ కాలములో విదేశ యాత్ర చేయుటయన్న అంత సులభ కార్యముకాదు. ఏలయన సముద్రయానము ప్రజలచే శాస్త్ర విరుద్ధముగ నెంచబడుచుండెడిది. ఎవరైన సముద్రయానము చేసిరా, వారికి మతగురువుల నుండి సంఘ బహిష్కారము తప్పదు. అట్టి పరిస్థితులలో గాంధీజి వెళ్ళవలయునాలేదా ? వెళ్ళకపోయిన నిష్కారణముగ చదువు నాశనమగును. వెళ్ళిన వారి వైశ్యకులజులు బహిష్కార శ్రీముఖమును పంపుదురు. ఏమి చేయవలయును ? సంఘ మట్లున్నది. కాని గాంధీజీ ఆ బహిష్కారమునకు భయపడక, యేదో ఒక పురాతనమగు ఆచారమును నమ్మి విద్యాభాగ్యమును కాలదోయుట ధర్మము కాదని యెంచి, యెట్టకేలకు ఇంగ్లాండుకు పయనమై ఓడలో వెడలిపోయెను. ఆ చిన్నవయస్సున గాంధీజీకి

యితరులతో మాట్లాడుటన్న తగనిసిగ్గు. అంతేకాక ఆ పడవలో ఆయనకు తగిన శాకాహారము దొరకుట చాల కష్టమయ్యెను. అయినను అట్టి కష్టముల కన్నిటికి ఓర్చి తుదకు ఇంగ్లాండు చేరెను.

అచ్చట కొందఱు స్నేహితు లాయనను మాంసాహారమును తినుమని యెన్నోవిధముల బలవంతముచేసిరి. లేకున్న ఆ దేశములో బ్రతుకు సాగించుట కష్టమని వాదించిరి. కాని మహాత్ము డంతటి చపలచిత్తుడా? ఆయన తన తల్లికిచ్చిన ప్రతిజ్ఞను త్రోసివుచ్చు నంతటి దుష్టుడా? అందుచే ఆయన వారెంతవాదించినను వినక, కలుగు కష్టముల కైన నోర్చి తన శాకాహార పద్ధతినే సాగించెను! చివరకు కాఫీ తేయాకులు కూడ నిరర్థకమని యెంచి విడచిపెట్టెను. అంతేకాక అచ్చటి పూటకూటిభోజనము సరిపడనందున స్వాయముగ తానే వంటచేసికొన నారంభించెను! ఏమి గాంధీజీ యొక్క పట్టుదల! ఏమి ఆయన ఓర్పు! ఆ వయస్సులో ఇంగ్లాండుకు వెళ్ళిన యెవరైన అట్టి కష్టములకు సమ్మతింతురా? మితవ్యయములో ఆయన అచ్చట తనకు సరిపడిన వంటను చేసికొనుచుండెను. అయితే అంతకష్టము కలుగుచున్నను ఆయన చదువుల కేమైన లోటు కలిగెనా? లేదు. ఆయన తన చదువు నేమాత్రమును నిర్లక్ష్యము చేయక కడుశ్రద్ధగా సాగించుకొనుచుండెను.

ఆ కాలమున ఇంగ్లాండులో ఒక విచిత్ర ఆచారముండెను. ఆదేమన బారిష్టరు పరీక్షకు చదువుకొనుచుండువారు తప్పనిసరిగ యితర విద్యార్థులకు కొన్ని విందులొసంగవలెను. మరియు తాము కూడ యితర విద్యార్థులొసగు విందులకు హాజరు కావలెను. గాంధీజీ ఆ విందుల కెక్కువ ప్రాముఖ్యత నివ్వక కష్టపడి

చదువసాగెను. తత్ఫలితముగ ఆయన ప్రీతి పరీక్షలోను బాగుగ కృతార్థుడు కాజొచ్చెను. ఆ కాలములోనే కొందఱు మిత్రుల సహాయమున ఆయన భగవద్గీతను, బైబులును బాగుగ చదివెను. ఆ కాలములోనే ఆయన శాకాహారమును గూర్చి పత్రికలలో వ్యాసములు ప్రచురించుచు, ఒకశాకాహార సమాజ కార్యవర్గమున సభ్యుడుగ పనిచేసెను. ఆయన అచ్చట నాట్యమును, వైలనును నేర్చుకొనుట కారంభించెను. కాని అవి ఆయన కంతగా సులభ సాధ్యము కానందున వానికి పూర్తిగ స్వస్తిచెప్పెను. ఈ విధముగ నింగ్లాండులో నించుమించు మూడు సంవత్సరములు గడిపి, బారిష్టరు విద్యను పూర్తిగావించుకొని, తన పవిత్ర నిరాడంబర జీవితముచే

గీ॥ ఏవి త్యజియింపమును తల్లి కిచ్చుమాట,
ఆమకార త్రియంబు నావంతయేని
ముట్టకయె గాంధిజీ ధన్యమూర్తియగుచు,
మాతృదేవిని గనువేడ్క మఱలివచ్చె॥

వ॥ కాని ఆయన రాకకు ఉప్పొంగి యెదురేగుటకు తల్లి యేది? పాపము! గాంధీజీ ఇంగ్లాండులో ఉన్నకాలములోనే ఆమె పరమపదించెను! ఇంగ్లాండులో నున్నప్పుడే ఆ దుఃఖవార్తను తెలియ జేసినచో, గాంధీజీ చాల కృంగిపోవునని యెంచి గాంధీజీ అన్నగారు ఆవార్తను ఆయనకు తెలియజేయలేదు. ఇంటికి వచ్చిన తరువాతనే గాంధీజీకి ఆ విషయము తెలిసెను. అప్పు డాయన తన మాతృ వియోగమున కెంతయో విచారపడెను. ఏలయన గాంధీజీకి మాతా పితరులయెడ చిన్నప్పటి నుండియు మితిలేని భక్తి గౌరవము లుండెను.

గాంధీజీ యింటికి చేరిన త్వరలోనే అనగా క్రీ. శ. 1891 లో బొంబాయి నగరమున బారిష్టరు వృత్తిని ప్రారంభించెను. కాని ప్రాక్టీసు యేది? న్యాయవాదనకు ఆయన వద్దకు వచ్చు కక్షిదారు లేరి? దానికి తోడు కొండను త్రవ్వి యెలుకను పట్టినట్లు, ఆయన అంత చదువు చదివి బారిష్టరు ప్యాసై వచ్చినను, కోర్టుకు పోయి వాదించుటయన్న ఆయన కెక్కడలేని భయము కలుగజొచ్చెను. వాదించుటకు కోర్టులో నిలిచినచో, శరీరమంతయు ముచ్చెమటలు పోయునే! కాళ్ళు చేతులు గడగడ వడకునే! నోటి నుండి మాట యెంత యత్నించినను పెకలిరాదే! ఎంత దురదృష్టము! ఎంత సిగ్గుచేటు! ఏమి చేయవలయును! లేకలేక ఒక స్త్రీ యేదో ఒక కేసుకు వకాలత యివ్వ, దానిని ఆయన కంగారు చేతనే పాడుచేయుట కూడ జరిగెను? ఇంక అక్కడ ఉన్న మర్యాద దక్కదని ఆయన వెంటనే తన కార్యాలయమును రాజకోటకు మార్చుకొనెను. కాని బొంబాయిలో కలుగని ధైర్యము అచ్చట మాత్రము యెట్లు కలుగును? ఏవియో కొన్ని అర్జీలు మున్నగునవి వ్రాసి యిచ్చుచు ఆయన యేదో కొంత సంపాదింపసాగెను. కాని అట్టి అర్జీలతో యెంతకాలము గడుపవలెను? ఆయన కేమియు తోచలేదు. అట్టి పరిస్థితులలో విచారముగ ఆయన

రాగం: తోడి. గేయము తాళం: మిశ్రచాపు

ప॥ ఎందుకు దయరాదురా ఓ దేవ నీ
కెందుకు దయరాదురా .................. ॥ ఎం ॥

అ॥ ప॥ ఎందుకు దయరాదు సుందర హృదయ నీ
మందహాసము చూపి డెందము నలరింప ॥ ఎం ॥

చ॥ 1. ఎందాకనోర్తునో మందమతిని నేను
పొందుగ వాదించు చందముఁ దెలుపఁగ ॥ఎం॥
2. దేవాదిదేవ! యీ దీనుని బ్రోవగ
రావా వేగమె నన్ను గావలేవా దేవా ॥ఎం॥
(మధ్యమ కాలము)
3. ఎంతచదివిననేమిలాభము, సుంతయైనను మాటరానిచో
పంతమును విడనాడి నాకిక చింతబాపగ యింతవేడ ॥ఎం॥

వ॥ అని పెక్కు విధముల ధ్యానము చేయుచుండెను. అట్టి పరిస్థితులలో పోర్బందరులోనున్న కొందఱు యీ విధముగ గాంధీజీ అన్నగారిని కోరిరి. ఏమని కోరిరి? 'ఒక కేసులో సహాయముచేయు నిమిత్తము మీ తమ్ముని ఆఫ్రికాకు పంపుదురా?' అని కోరిరి. అప్పుడు అది కూడ ఒక విధముగ మంచికే వచ్చినదనుకొని గాంధీజీ దానికి సమ్మతించెను. ఆ రీతిగ ఆయన 1893 లో ఆఫ్రికా ఖండమునకు పోయెను. అప్పటికి ఆయన ప్రజానాయకునిగాని, మహాత్మ బిరుదాంకితునిగాని కాలేదు.

కాని అప్పటి నుండియే ఆయన ధైర్యసాహసములు వెల్లడి కాజొచ్చెను. దర్బాను నగరములో ఆయన అచ్చపు భారతీయ దుస్తులతో న్యాయవాదిగ కోర్టులోనికి పోయెను. కాని అచ్చటి తెల్లన్యాయాధిపతి అది చూచి సహింపలేక తలపాగ పెట్టుకొని కోర్టులోనికి వచ్చుటకు వీలులేదని ఆజ్ఞాపించెను. దానితో గాంధీజీ లోని వీరత్వము బయల్పడెను. ఆయన వెంటనే తన తలపాగను మాత్రము తీయుటకు వీలులేదని వక్కాణించి బయటికి వెడలి పోయెను. ఆ కాలములో ఆఫ్రికావంటి విదేశములో న్యాయాధిపతి

యెదుట అట్లు యింకెవ్వరైన చేయగలరా? అంతటితో గాంధీజీ ఊరకొనెనా? లేదు. తలపాగ ధరించుటకు ప్రతిభారతీయునికి హక్కు కలదని వివరించుచు ఆయన పత్రికలకు వ్యాసములు వ్రాసెను. దానితో మూడు నాలుగు రోజులలోనే ఆయన కీర్తి నలువైపుల విస్తరించెను.

అసలు తాను వచ్చిన కేసును వాదించు నిమిత్తము గాంధీజి దర్బాను నగరము నుండి ప్రిటోరియా నగరమునకు వెళ్ళవలసి వచ్చెను. అప్పుడు ఆ ప్రయాణములో ఆయనకు తెల్లవారి వలన యెన్నో కష్టములు అవమానములు కలిగెను. భారతీయు డను కారణముచే ఆయనకు రైలులో మొదటి తరగతి ప్రయాణము నిరాకరింపబడెను. గుఱ్ఱపు బండ్లలో తగిన స్థానము దుర్లభము చేయబడెను. అంతేకాదు. కడకు బండితోలు నాతడు కూడ ఆయనను క్రూరముగ కొట్టెను. కాని గాంధీజి ఊరక సహించి మిన్నకుండు వాడేనా? ఆయన తనకు జరిగిన అన్యాయములను యెప్పటికప్పుడు సదరు కంపెనీలకు ఫిర్యాదు చేసి తన ఆత్మగౌరవమును వెలిబుచ్చు చుండెను. తన సహజ వీరలక్షణములను ప్రకటించుచుండెను. అట్లు పెక్కు కష్టముల నెదుర్కొనుచు, ఆయన యెట్టకేలకు ప్రిటోరియాకు చేరెను. ఆయన వచ్చిన కేసు విషయమై ఉభయ పక్షముల వారికి చక్కని హితోపదేశము చేసి వారిలో వారు రాజీపడునట్లు చేసెను. ఆయన ధైర్యసామర్థ్యముల చూచి సంతసించి అచ్చటి భారతీయు లాయనను ఆఫ్రికాలోనే ఉండి, తమ హక్కులకై పోరాడుమని ప్రార్థించిరి. గాంధీజీ సహజముగనే ప్రజాసేవా పరాయణత్వము గలవాడు కావున వారి ప్రార్థనలను అంగీకరించెను.



శ్రీరస్తు

# ★ బాపూజి ★

★

## రెండవ ప్రకరణము

తో॥ ఆపగిదిని గాంధీజి వచించియు నాదరముగ నందుండెన్।
తాపమనక తనజనులమేలుకై తాసర్వంబును జేసెన్॥
భారతీయులకు గల్గు బాధలను బాగుగ తాయోజించెన్।
వారికెల్ల నాయకుడై తానట వీరుడౌచు వర్తించెన్॥
ఆకాలంబున నంతధైర్యమున నలరువారు లేకున్నన్।
ప్రాకటముగ తాసర్వదీనులకు బాంధవుడై విలసిల్లెన్॥

గీ॥ అపుడు దొరతన మొప్పార నలరుచున్న
శ్వేతజాతులు భారతజాతి ప్రజకు
ఓటుహక్కును తొలగింప నుత్సహించి
చట్టమును జేయబూనిరి జాలిగనక॥

వ॥ ఆ చట్టము యొక్క ఉద్దేశ మేమన భారతీయులకు అచ్చట ఓటు హక్కు లేకుండా చేయుట. కాని గాంధీజీ అట్టి ప్రయత్నమును చూచి చేతకానివానివలె యూరకుండునా ? ఆయన ఆ చట్టమునకు అసమ్మతిని దెల్పుచు 15 వేల భారతీయుల సంతకములతో ప్రభుత్వమువారి కొక విన్నపము నంపెను. కాని ఆ ప్రభుత్వమువారు ఆ విన్నపమును ఒక మూలవైచి అచిరకాలములో ఆ చట్టమును చేసివైచిరి! అట్టి ఫలితమును చూచి

యే మానవుడైన సహజముగ నిరుత్సాహ పడవలసినదే కదా? కాని గాంధీజీ అట్టి కార్యభీరువుకాదు. ఆయన కార్యశూరుడు. అందుచే అచ్చటి భారతీయులలో సంఘీభావము కలిగించిననే గాని వారి హక్కులను ప్రభుత్వమువారు పాటించరని గ్రహించెను. 1894 లో నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ అను పేర నొక సంస్థను స్థాపించెను. భారతీయులు పెక్కురు దానిలో సభ్యులుగ జేరునట్లు చేసెను. అచ్చటి భారతీయుల హక్కులను గురించి బ్రిటిష్‌వారికి విజ్ఞప్తి చేయుచు గ్రంథములు వ్రాసి ప్రచురించెను. కూలీల తరఫున కూడ ఆయన యెక్కువగ కృషి చేసెను.

ఆ రీతిగ మూడేండ్లు గడచెను. అంతట ఆయన ఒక పర్యాయము భారతదేశమున పర్యటనము చేయుటకు వచ్చెను. ఆ సమయమున బొంబాయిలో ప్లేగువ్యాధి చెలరేగి యెక్కువగ వ్యాపించెను. అట్టి పరిస్థితులను జూచి ఆయన యెట్లూరకుండ గలడు? ఆయన వెంటనే మాలమాదిగల యిండ్లకు స్వయముగ పోయి ఆ వ్యాధిని పాఱదోలుటకు యెక్కువగ తోడ్పడెను. అది పూర్తిగ తొలగిపోయిన పిమ్మట, ఆయన పూనా, మదరాసు, కలకత్తా నగరములకు వెళ్ళెను. అచ్చట సభలు చేసి, ఆఫ్రికాలోని భారతీయుల కష్టముల గూర్చి ప్రచారము చేసెను. అంతట మరల ఆఫ్రికాకు వెడలిపోయెను. అచ్చట శ్వేతజాతివారు ఆయనపై క్రోధోద్రేకులై ఆయనను చంపివేయుటకు సిద్ధపడిరి. ఓడదిగి ఆయన యింటికి పోవు సమయమున దారిలో వారు ఆయనపై నిర్దయులై రాళ్ళు కురిపించిరి. పాపము! ఆ దెబ్బలకు ఆయన స్మృతితప్పిపడి పోయెను. అప్పుడు దైవికముగ పోలీసు సూపరెంటు సతీమణి

అచ్చటకు వచ్చుట తటస్థించెను. ఆమె దయదాల్చి ఆయనను కాపాడెను. దుండగు లెచ్చటి వారచ్చట చెదరిపోయిరి. అంతట గాయములతో ఆయన తన స్నేహితుడగు రుస్తుంజీ యింటికి వెడలెను. అచ్చట కూడ తెల్లవారు మరల ఆయనను ముట్టడింప వచ్చిరి. ఆ సందర్భమున పోలీసు సూపరెంటు సలహాపై ఆయన పోలీసు వేషము వేసికొని, దొడ్డిదారిని పోలీసు స్టేషనుకు వెడలెను.

ఈ దుండగులను గూర్చిన వార్తలు విని, ఇంగ్లాండు నుండి చేంబర్లేను ప్రభువు గాంధీజీని హింసించిన వారిని శిక్షింపవలసినదని తంతి నంపెను. కాని గాంధీజీ అప్పుడొక గొప్ప విశేషమును చేసెను. అదేమన తనను హింసించిన వారిని ఆయన క్షమించుచున్నానని ప్రకటించెను. ఇంక చెప్పవలయునా? ఆయన ఔదార్యమునకు అచ్చటివారు ఆయనను గొప్పగా మెచ్చుకొనిరి. తాము చేసిన చెడుపనికి పశ్చాత్తాపపడిరి. దానితో గాంధీజీ ప్రతిష్ఠ మెన్నో మడుగు లెక్కువయ్యెను! అందువలననే మన పూర్వులు క్షమా గుణము నంతగా కొనియాడిరి. అందువలననే భర్తృహరికవీంద్రుడు కూడ క్షమాగుణమును గూర్చి ఆ రీతిగ చెప్పినాడు. ఏ రీతిగ?

శ్లో॥ క్షాన్తిశ్చేత్కవచేనకిం? కిమరిభిః క్రోధోస్తి చేద్దేహినాం?
జ్ఞాతిశ్చేదనలేనకిం? యదిసుహృద్దివ్యౌషధైః కింఫలం?
కింసర్పైర్యది దుర్జనః? కిముధనైర్విద్యానవద్యాయది?
వ్రీడాచేత్కిముభూషణైః? సుకవితా యద్యస్తి రాజ్యేనకిం?

వ॥ అనగా అర్థమేమి?

చ॥ క్షమకవచంబు, క్రోధ మది శత్రువు, జ్ఞాతిహుతాశనుండు, మి
త్రము తగుమందు, దుర్జనులు దారుణ పన్నగముల్, సువిద్య వి

త్త ముచితలజ్జ భూషణ, ముదాత్తకవిత్వము రాజ్య, మీాతీమా
ప్రిముఖ పదార్థముల్ గలుగుపట్టునఁ దత్కవచాదు లేటికిఁ?

వ॥ అది యట్లుండ, అంతటితో చాలదనినట్లు గాంధీజీ తన ఔదార్యమును బ్రకటించుటకు భగవానుఁడు మఱియొక అవకాశము నొసగెను. అదేమన, ఆఫ్రికాలోని బోయరుజాతి వారికిని, అచ్చటి తెల్లప్రభుత్వమువారికిని, యుద్ధము సంభవించెను. అప్పుడు గాంధీజీ ఒక యుద్ధసేవాదళము నేర్పఱచికొని ప్రభుత్వము నకు విశేషముగ వైద్య సహాయము చేసెను. అప్పు డాయన మహాదార్య మహోపకారములను జూచి తెల్లవారు ఆయనను మిక్కుటముగ గౌరవించి మెచ్చుకొనిరి.

పిమ్మట 1899 లో గాంధీజీ మఱల భారతదేశమునకు బయలుదేరెను. అప్పుడు ఆఫ్రికావాసులు ఆయన కిచ్చిన కానుకలకు లెక్కయే లేదు. వెండి బంగారు వస్తువులు, వజ్రములు ఆయనపై ఊరక కురిపింపబడెను. కాని అవియన్నియు తాను తీసికొనెనా? వాని నన్నిటిని జేర్చి ఒక నిధి నేర్పరచి, దానిని ప్రజల సేవకే ఉపయోగించు నిమిత్తము ఆయన తగిన ధర్మకర్తలను నియమించెను. గమనించితిరా గాంధీజీ ధనకాంక్షా రాహిత్యము! అందుచేతనే ఆయన మహాత్ముఁడయ్యెను.

తే॥ ఈరీతిగ తా దక్షిణాఫ్రికా వారల కెంతయు సేవన్।
కూరిమితో గావించి గాంధిజీ కోరిక మీఱగ నంతఁ॥
మాతృదేశ సందర్శనమునకై మానుగ వచ్చెను వేగన్।
మాతృదేశ సేవాభిమానములు మాన్యుల నైజముగానఁ॥
అంత భారతావని దర్శించియు నధికమైన ననురక్తిఁ।
చెంతమైన కలకత్తా కాంగ్రెసు చేరెను సేవాభక్తిన్॥

గీ॥ కాని గాంధీజి భారతఖండమందు
కాలు నిల్పిన యతిస్వల్ప కాలమునకె
తానొకటిఁయెంచ నన్యథా దైవమెంచు
ననెడు నార్యోక్తి నిక్కమై యలరె నకట॥

వ॥ అది యెట్లన, ఆఫ్రికాలో బోయరు యుద్ధ కాలమున యితరులతో పాటు కొందఱు భారతీయులు కూడ ట్రాన్సువాలును విడచి గ్రామాంతరములకు వెళ్ళిరి. యుద్ధకాలమున ప్రజలు అట్లు వెడలుట సహజమే కదా. పిమ్మట యుద్ధము ముగిసినది. అప్పుడు యితరులతో పాటు భారతీయులు కూడ ట్రాన్సువాలుకు తిరిగి పోదలచిరి. కాని ఆంగ్ల అధికారులకు పెద్ద పెద్ద లంచము లిచ్చిననే గాని భారతీయులు మఱల ట్రాన్సువాలులో ప్రవేశించుట కవకాశము లేకుండ చేయబడెను. అందఱు పెద్ద పెద్ద లంచము లెచ్చటి నుండి తేగలరు? అందుచే పత్రికలలో సహజముగ పెద్ద అలజడి బయలు దేరెను. అది గాంధీజీ చెవినిపడెను. ఆయన అంతట యెట్లూరకుండగలడు? వెంటనే ఆయన ఆఫ్రికాకు వెడలెను. 'భారతీయుల అభిప్రాయము' అను పేర నొక పత్రికను స్థాపించి తీవ్రముగ భారతీయుల హక్కులను గూర్చి ప్రచారము చేయ సాగెను. తనకు హాని చేయువారికి కూడ అవసరము కలిగినప్పుడు వెనుదీయక ఉపకారము చేయు గొప్ప ఔదార్యము గాంధీజీ మేలి భూషణముగా నుండెను. అందుచే ఆయనకు విరోధులైనవారు కూడ యెందఱో ఆయనకు గొప్ప గౌరవము చూపుచుండిరి. గాంధీజీ అచ్చట ఒక ఆశ్రమమును స్థాపించి అందులో సకుటుంబముగ నిరాడంబర జీవితమును గడపుచుండెను. ఆయన

అచ్చట బారిష్టరుపని చేయుచున్నను, ఒక అధర్మపు కేసైన స్వీకరింపక యెల్లప్పుడు ధర్మదీక్షతో పనిచేయుచుండెను. 1914లో ఆంగ్ల జర్మను మహాయుద్ధము ప్రారంభమయ్యెను. అప్పుడు కూడ గాంధీజీ ఒక సేవాదళముతో వెడలి బ్రిటిషువారికి వైద్య సహాయము చేసెను.

గీ॥ ఈవిధంబుగఁ దనదివ్య జీవితమునఁ
గొంత నాఫ్రికాప్రజ కొఱకుఁ గడపి
యంతభారతదేశ సేవార్థియగుచు
తిరిగి వచ్చెను గాంధీజి దీక్షమెఱయ ॥

వ॥ తిరిగి వచ్చి అహమ్మదాబాదులో ఒక ఆశ్రమమును స్థాపించెను. అప్పటి కింకను ఆయనకు 'మహాత్మ' డను బిరుదు రాలేదు. అందుచే ఆయనను చూచుటకు ప్రజలంతగా మూగు చుండెడివారుకారు.

ఇట్లుండ హిమాలయ పర్వత పాదములలో చాంపరాణ్ అను నొక ప్రదేశముండెను. అచ్చట రైతులు 'తీన్‌కఠియా' అను నొక పద్ధతిచే యెక్కువగా బాధపడుచుండిరి. ఆ పద్ధతి యేమనగా ప్రతిరైతును తనకు గల భూమిలో ఎకరమునకు 3 కఠియాలు చొప్పున తప్పని సరిగా నీలిమందు పండించి అది ఆంగ్లవర్తకులకు యిచ్చి తీరవలెను. అక్కడ ఎకరమనగా 20 కఠియాలు. ఆరైతుల కష్టములు విచారించుటకు గాంధీజీ అచ్చటకు వెళ్ళెను. లక్షలకొలది ప్రజలు ఆయనను చూచుటకు వచ్చిరి. ఆ దృశ్యమును చూచి ప్రభుత్వమునకు కంటకమయ్యెను. అందుచే ప్రభుత్వము గాంధీజీని తక్షణమే విడిచి పొమ్మని ఆజ్ఞాపించెను. ఆయన అట్టి ఆజ్ఞలను

శిరసావహించుటకేనా అచ్చటికి వచ్చినది? అందుచే అచ్చటి కార్యము పూర్తియగువరకు వెళ్ళజాలనని ఆయన ప్రత్యుత్తర మంపెను.

మఱునాడు గాంధీజిపై కోర్టు విచారణ. ఇంక చెప్పవలయునా? ఆయన మహాత్మ్యమా అనినట్లు లక్షలకొలది జనులు కోర్టుచుట్టును మూగిరి. ఆ ప్రజాసముద్ర తరంగములను జూచి యెవరికి దిగ్భ్రమ కలుగదు? కలెక్టరు మెల్లగ ఆయనపై కేసు కొట్టివేసి మీ పని మీరు చూచుకొనవచ్చునని విడచి పెట్టెను. పిమ్మట ప్రభుత్వమే గాంధీజీతో కలసి ఒక విచారణ జరిపి ఆ తీన్‌కతియా పద్ధతిని మర్యాదగ తీసివేసెను. చూచితిరా గాంధీజీ ప్రతిభ? ఇంకను భారతదేశములో యిది మొదటి ప్రయత్నమే! అందులోనే అద్భుతమైన ప్రజా విజృంభణము! ఆశ్చర్యకరమగు విజయము!

అది యట్లుండ అహమ్మదాబాదు మిల్లులోని పనివారు తమ యజమాను లిచ్చు కూలి తిండికి బట్టకు చాలుటలేదని చాలకాలమునుండి మొఱపెట్టుకొనుచుండిరి. అందుచే పంచాయతీని ఒక దానిని యేర్పఱచుకొని కూలీల మొఱలు పరిష్కరింపుడని గాంధీజి మిల్లు యజమానులకు సలహానిచ్చెను. కాని యజమానులు ఆయన సలహాను లెక్కచేయలేదు. అప్పుడింక ఆయన యేమి చేయవలయును? మీ కోర్కెలు సమ్మతింపబడువరకు సమ్మె చేయుడని కూలీలకు సలహా యిచ్చెను. సరేనని కూలీలు వెంటనే సమ్మె చేసిరి. ఒకదినము, రెండు దినములు, మూడు దినములు. ఇట్లు దినములు తరువాత దినములు గడచిపోవసాగెను. ఎన్ని దినములు గడచినను మిల్లు యజమానులు కొంచమైనను చలింప లేదు. పాపము! దినవేతనములపైన ఆధారపడి జీవించు ఆ కూలీలు

యెట్టి సంపాదన లేకుండ యెన్ని దినములు సమ్మె సాగింపగలరు? వారికి వేఱుగ జీవనాధార మేమున్నది? ఆ విషమ పరిస్థితిని చూచినాడు గాంధీజీ! కూలీల దీనావస్థకు మిల్లు యజమానుల పట్టుదలకు చాల చింతించినాడు. ఇంక తాను పూనుకొనక పోయిన కూలీల పని చాల హీనమగునని గమనించినాడు. తన సలహాలను శిరసావహించి సమ్మె చేసిన కూలీలకు ఆ విషమ పరిస్థితిలో తనకు చేతనైన సహాయము జేయుట తన ముఖ్యధర్మమని భావించినాడు. "వెంటనే కూలీల కోరిక లీడేరువరకు తాను అన్నము ముట్ట" నని లోకమునకు వెల్లడించినాడు. అతిఘోరముల కఠిన ఉపవాసము ప్రారంభించినాడు. ఇంక చెప్పవలయునా? ఆయన ఉపవాస వార్త పత్రికల ద్వారా ఒక క్షణములో దేశమంతట విద్యుద్వేగమున వ్యాపించెను. ఈ గొడవతో మనకేమి లెమ్మని దేశము ఊరకొనినదా? ఎట్లూరకుండగలదు? ఆయన యెవరికొరకు ఆ శ్రమ యంతయు పడుచున్నది? దేశము కొఱకు కాదా? అందుచే మఱుక్షణములోనే "గాంధీజీ కోరిక ప్రకారము నడచుకొనుడు, నడచుకొను" డని తంతి వార్తలు అన్ని దిక్కుల నుండి శతపరంపరలుగ వచ్చి మిల్లు యజమానుల కార్యాలయమును నింపివైచెను! ఇంక వేఱుగ చెప్పనేల? మూడవ నాటికి మిల్లు యజమానులు గాంధీజీ నిర్ణయించినంత కూలీ యిచ్చి పనివాండ్రతో రాజీపడిరి! ఈ ఉపవాస ఆయుధమును గురించి యిదివరకెన్నడును లోకము వినలేదు. అప్పుడు గాంధీజీ చేతిలో దాని యద్భుత అపూర్వ ప్రభావమును చూచి లోకమంతయు మహాశ్చర్యములో మునిగి తేలెను. అది గాంధీజీ దివ్యప్రభావమునకు రెండవవిజయము.

అటుపిమ్మట ఒకమారు బొంబాయి రాజధానిలోని ఖేడా జిల్లాలో పంటలు నాల్గవ వంతు మాత్రమే పండెను. అందుచే రెమిషను యిప్పింపుడని రైతులు ప్రభుత్వమును కోరిరి. దానిని గురించి వల్లభాయి పటేలుగారు బొంబాయి శాసన సభలో ఆందోళన సాగించెను. కాని ప్రభుత్వము అవియన్నియు యేమాత్రము లెక్కచేయక పై పెచ్చు బెదరింపసాగెను. అప్పుడు గాంధీజీ ముందుకు వచ్చి దానికి విరుగుడు రైతులు సత్యాగ్రహము చేయుటే అని బోధించెను. అది బాగున్నదని మెచ్చుకొని రైతులు ప్రభుత్వమునకు శిస్తులు చెల్లింప నిరాకరించిరి. ప్రభుత్వము రైతుల పనికి పైమెత్తుగా వారి పంటలను భూములను పగతో యెంత చౌకధరకైన తెగనమ్మజూచెను. కాని కొనువారెవరు? ధర్మప్రభావమో అనినట్లు వానిని కొనుటకు ఒక చీమ కూడ ముందుకు రాలేదే! అప్పుడింకేమి చేయవలెను? ఏమి చేయుటకును తోచక ప్రభుత్వము ఒక పొలములోని ఉల్లిపంటను జప్తుచేసెను. అప్పుడేమాత్రమును జంకక రైతులు అదే ఉల్లిపంటను మఱియొక చోటికి చేర్చిరి. ఇంకేమి చేయవలెను? ప్రభుత్వమప్పుడు కొందఱు నాయకులను అరెస్టు చేయ మొదలిడెను. అప్పుడు దానికెవరైన భయపడిరా? 'నన్ను ముందు అరెస్టు చేయుడు, నన్ను ముందు అరెస్టుచేయుడు' అనుచు రైతులు అసంఖ్యాకముగ రాసాగిరి. అప్పు డెవ్వరిని అరెస్టుచేయవలెను? ఎంతమందిని అరెస్టుచేయవలెను? ఏమి ఆ అద్భుత ప్రజాశాంతియుత విజృంభణము! వీరు పూర్వపు బెదరిపోవు భారతీయులుకారే! ఇదియంతయు చూచి ప్రభుత్వము మర్యాదగ గాంధీజీ షరతులకు సమ్మతించి రాజీకివచ్చెను. ఆ అద్భుత సత్యాగ్రహ విజయవార్త భారతదేశమంతటను విద్యుద్వేగమున వ్యాపించెను. భారతీయులందఱు గాంధీజీ మహాత్మ్యమును పలువిధముల పొగడసాగిరి.

శ్రీరస్తు

# ★ బాపూజి ★

★

## మూడవ ప్రకరణము

వ॥ అప్పుడు ఐరోపా ఖండములో నేట్లుండెను?

తే॥ ఇంతలోన జర్మనీయుద్ధమున ఇంగ్లాండోడునోయనుచున్ ।
చింతతోడ ఇంగ్లీషు ప్రభుత్వము చీదర జెందుచునుండెన్ ॥
భారత దేశపు రాజప్రతినిధి బాగుగ గాంధీగారికి ।
చేరబిలచి సంగ్రామ సహాయముచేయుమనుచు బ్రతిమాలెఁ ॥
గాంధీగారును సాయముచేయగ గ్రక్కున సమ్మతపడియెఁ ।
సంధిల్లును స్వాతంత్ర్యము మనకని సమరానంతర మందున్ ॥

వ॥ గాంధీజీ ఆ నమ్మకముతో యెంతో శ్రమ కోర్చి గ్రామ గ్రామమునకు తిరిగెను. బ్రిటిషు వారికి ధనసహాయమును యోధుల సహాయమును చేసెను. కాలక్రమమున యుద్ధము ముగిసెను. బ్రిటిషువారికే విజయము లభించెను. అంతట స్వరాజ్య మిప్పింపుమని గాంధీజీ బ్రిటిషువారిని కోరెను. వారు దానికి బదులుగా దేశములో రౌలట్ శాసనమును బ్రవేశపెట్టిరి. ఆ చట్టము ప్రకారము ప్రభుత్వమువారు దేశములో నెవ్వరినైనను విచారణలేకయే యెట్టి శిక్షకైన గురిచేయ వచ్చును. ఏమి యీ యన్యాయమని గాంధీజీ యెంత విన్నవించినను అది అరణ్యరోదన మయ్యెను.

అప్పుడు వేరుమార్గము లేక గాంధీజీ ఏప్రిల్ 6 వ తేదీన దేశమంతట హరితాళము జరుపవలయునని ఆజ్ఞాపించెను. అంతట యేమని చెప్పవలయును? దానిని వర్ణించుటకు ఆదిశేషువునకైన తరము కాదేమో! ఏలయన దేశములోని లక్షలకొలది పల్లెలు, వందలకొలది పట్టణములు ఏకధాటిగా హరితాళము గావించెను. నిజముగ ప్రజలను పాలించుచున్నది బ్రిటిషు ప్రభుత్వమా లేక గాంధీజీయా యనునట్లుండెను. ఎచ్చట చూచినను ప్రజలు అపూర్వ ధైర్యోత్సాహములతో

రాగం: మోహన గేయము తాళం: ఆది.

జై! జై జై! భారతమాత!
జయమునీకు మామంగళ చరిత! ॥ జై ॥
భారతజాతికి స్వేచ్ఛయెలేదా?
భారతీయులకు రాజ్యము రాదా?
లేరా! లేరా! భారత వీరా!
పౌరుషమున పోరాడగ రార! ॥ జై ॥
ఎంతకాలముర బానిసతనము?
ఎంకాలమీ పరాధీనము?
చింతవీడి మన గాంధిమహాత్ముని
చెంతజేరి సేవింపగరార! ॥ జై ॥
గాంధిమహాత్ముడు కన్నతండ్రిరా
గాంధిమహాత్ముడు దైవసముడురా
గాంధిమహాత్ముని దీవన గైకొని
వేగమె భారత స్వేచ్ఛను గనరా ॥ జై ॥

వ॥ అను ప్రబోధగీతములు నలుదిక్కుల మారుమ్రోగ సాగెను. ఆ యపార ప్రజోత్సాహమును యెట్లైనను అణచవలెనని ప్రభుత్వము పెక్కు చోటులలో పోలీసు దళములచే ప్రజలను క్రూరముగ కొట్టించి కాల్పించెను. దానిచే ప్రజలకు ప్రభుత్వముపై మఱింత ద్వేషము కలిగెను.

అంతట 1920 సెప్టెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు నందు ప్రభుత్వముపై సహాయ నిరాకరణోద్యమము జరుపవలసిన దని గాంధీజీ ప్రజల కుద్బోధించెను. అచిరకాలములో ఆ ఉద్యమము అత్యద్భుతముగ దేశమంతట వ్యాపించెను. ప్రజలు కోర్టులను, శాసనసభలను, విదేశవస్తువులను, తీవ్రముగ బహిష్కరింపసాగిరి. ఎచ్చట చూచినను ప్రజలు

రాగం: మోహన గేయము తాళం: త్రిశ్రజాతి రూపకం

కొల్లాయి గట్టితే నేమి
మా గాంధి కోమటై పుట్టితే నేమి। ॥ కొ ॥
నాల్గు పరకల పిలక నాట్యమాడే పిలక
నాల్గు వేదంబుల నాణ్యమెరిగిన పిలక ॥ కొ ॥
చకచక నడిస్తేను జగతి కంపించేను
పలుకు పలికితేను బ్రహ్మవాక్యేను ॥ కొ ॥
బోసినోర్విప్పితే ముత్యాల తొలకరి
చిరునవ్వు నవ్వితే రత్నాల వర్షము ॥ కొ ॥

వ॥ అని గాంధీజీని స్తోత్రము చేయసాగిరి. ఆ పాటలోని ప్రతి అక్షరమును గాంధీజీ విషయములో నిజమనిపించెను. అది చూచి సహింపలేక ప్రభుత్వము ఆయనను చెఱలో నుంచెను.

కాని ప్రజ లూరకొందురా ? అందుచే వారి తీవ్రాందోళన వలన మరల 1924 లో విడుదల చేసెను. అంతట ఆయన ఆజ్ఞ చొప్పున దేశమంతటగల నాయకులు ప్రజాసముదాయములో నెక్కుడుగ జాతీయప్రబోధము చేయసాగిరి. నూలు వడకుట, మద్యమును నిషేధించుట, విదేశ వస్తువులు బహిష్కరించుట, మున్నగు కార్యక్రమమును జరిపింపసాగిరి.

1929 లో భారత రాజప్రతినిధియగు ఇర్విన్ ప్రభువు నాయకులు కోరిన విధమున భారతదేశమునకు డొమినియన్ ప్రతిపత్తి నిచ్చుట కిష్టమేనని ప్రకటించెను. కాని త్వరలోనే ఆ ప్రకటనను అతిక్రమించెను. అందుచే గాంధీజీ సత్యాగ్రహము చేయ నిశ్చయించుకొని ప్రభుత్వము వారి ఉప్పు చట్టము నుల్లంఘింపుడని ప్రజల కుద్బోధించెను. దేశమంతటను అత్యద్భుత చైతన్యముతో ప్రజలు అట్లే చేయసాగిరి. పోలీసువారు ప్రజలను నాయకులను కొట్టుచు, కాల్చుచు, ఎరెస్టు చేయుచు నెంతో ప్రయత్నించిరి. కాని గాంధీజీ మహాత్మ్యమో యన్నట్లు ప్రజలలో ధైర్యోత్సాహములు తగ్గుటకుమారు హెచ్చసాగెను.

తుదకు నేమిచేయుటకును తోచక ప్రభుత్వమువారు గాంధీజీని భారతదేశ స్వాతంత్ర్యమును గురించి చర్చింప రెండవ రౌండుటేబులు సభకు ఇంగ్లాండున కాహ్వానించిరి. ఆయన అచ్చటికి తన కొల్లాయి గుడ్డలతోనే వెడలి, సంపూర్ణ స్వాతంత్ర్యమును కోరుటకు భారతీయులకు హక్కు కలదని నిర్భయముగ ఉద్ఘాటించి వచ్చెను. అది ప్రభుత్వమునకు రుచించునా? అందుచే ప్రభుత్వము మరల ఆయనతో కూడ వేల కొలది నాయకులను బంధించి చెఱలో వైచెను.

అంతట మితవాదులు, సంస్థానాధిపతులు మున్నగువారితో నింగ్లాండులో మూడవ రౌండుటేబులు సభజరిపెను. ఆ సభలో హరిజనులు హిందువులుగా భావింపబడక, వారికి ప్రత్యేక ఎన్నిక వర్గము లేర్పరుప నిర్ణయింపఁబడెను. ఆ అన్యాయమును గాంధీజీ యెట్లు సహింపగలఁడు? అందుచే జైలునందుండియే ఆశాసనమునకు తన అసమ్మతిని దెలుపుచు ఆయన ఉపవాసమును ప్రారంభించెను. వెంటనే ఆ వార్త పత్రికల ద్వారా లోకమంతట వ్యాపించెను. గాంధీజీ అద్భుత పద్ధతులకు లోకమంతయు దిగ్భ్రమ చెందెను. ఎట్లైనను గాంధీజీని బ్రదికింపవలెనను తంతివార్తలు నలుదిక్కుల నుండి వేలకొలది ప్రభుత్వ కార్యాలయమునకు వచ్చి పడెను. దానికి ఫలితమేమి? 5 దినములలో ప్రభుత్వము గాంధీజీతో రాజీ చేసికొనెను. ఎచట చూచినను నాయకులు,

సీ॥ హరిజన శబ్దార్థ మరసి మీకడదార్చి
యస్పృశ్యతాచార మణచవలదె?
తమపాఠశాలలఁ దగవారి రప్పించి
ఉచిత విద్యాభ్యాస మొసగవలదె?
సర్వసముని చెంత సమత చెన్నారంగ
దేవళంబులఁ జేర్పఁ దివుర వలదె?
సకల జనాశ్రియ స్థానంబులకుఁ బిల్చి
సాంఘికస్థితి వృద్ధి సలుపవలదె?
గీ॥ అన్నివేళలను హరిజను లన్యులనెడు
భావమునువీడి సోదర భావమూని
సంఘబలము నొసంగు సంస్కారములను
సలుపవలదె? యేకత్వము నిలుపవలదె?

వ॥ అని ప్రజలకు ప్రబోధింపసాగిరి. మరల 1933 లో చెఱసాలలో నుండియే గాంధీజీ 21 దినములు ఉపవాసముచేసెను. దానితో దేశమునందు పెక్కు దేవాలయములలో హరిజన ప్రవేశము జరుపబడెను. ఆయన పద్ధతుల అద్భుత ప్రభావము చూచి ప్రజలకును, ప్రభుత్వమునకును చాల ఆశ్చర్యము కలుగు చుండెను. అంతట ప్రభుత్వము ఆయనను విడుదలచేసెను. పిమ్మట ఆయన భారత దేశమంతయు సంచారము చేసి, హరిజన వృద్ధికై యెక్కువ నిధిని ప్రోగు చేసెను. ఎక్కడ చేయిచాచినను ప్రజలు ఆయన చేతులను లక్షల కొలది ధనముతో నింపుచుండిరి. 'చూచుటకు సన్నగా ఉండి స్వల్ప ఆహారముతో కడుపునింపుకొను యీాయనేనా యింత అద్భుత లీలలు సలుపుచు యింత గొప్ప దేశమునకు నాయకత్వము వహించి విలసిల్లుచున్న' దని అందరికిని అత్యాశ్చర్యము కలుగుచుండెను.

1935 లో దేశమందంతట యెన్నికలు జరుపబడెను. ఇంక వేఱుగ చెప్పవలయునా? మదరాసు, బీహారు, బొంబాయి, బెంగాలు, ఒరిస్సా, మధ్యపరగణాలు, సంయుక్త పరగణాలలో కాంగ్రెసువారే రాష్ట్రశాసన సభలకు అధికసంఖ్యాకులుగ ప్రజలచే యెన్నుకొనబడి మంత్రులైరి. ప్రజలు యెచ్చట చూచినను దేశమును దేశనాయకులను గూర్చి

సీ॥ భళిర! భారతజాతి భాగ్యవిధాతయై
మన మహాత్మగాంధి ఘనతఁ జెందె!
జగదేక విజ్ఞాని యనుచు జవ్హారిలాలు
భారతనాయక ప్రతిభ తెలిపె।

వీరరసంబును నూరిపోయుచు సుబాస్
బోసుసింహము కత్తిదూసి నిలచె।
స్వాతంత్ర్య సమర నిష్కా-ను యోధుండౌచు
అబ్దుల్‌గఫ్ఫారుఖా నలరుచుండె।
వీర నారీమణి విద్యా విభూషిత
యగుసరోజినిదేవి యండనిలచె।
ఆఱురాష్ట్రములందు నతిరథ ప్రకరంబు
మంత్రులై ప్రజల సమ్మతిని వరలె।

గీ॥ ముప్పదియు నాఱుకోటుల ముద్దుసుతులు
నిన్ను నిరతంబు సేవింప నిలిచియుండె,
మాతలకు మాతయౌచు సంపదలతోడ
కరుణ జగమేలు మింక మాభరతమాత ॥

వ॥ అనుచు పలువిధముల స్తోత్రము జేయసాగిరి. పిమ్మట 1938 ఫిబ్రవరిలో గాంధీజీ సలహా చొప్పున కాంగ్రెసు మహాసభ హారిపురమను నొక పల్లెటూరిలో జరుపబడెను. ప్రజల దృష్టిని పల్లెటూళ్ళ అభివృద్ధివైపు మరల్చుటయే అట్లు చేయించుటలో గాంధీజీ ఉద్దేశము.

తదుపరి 1939 మార్చిలో రాజకోట సంస్థానపు రాజు తన సంస్థానములో ప్రజాప్రభుత్వము స్థాపించుటకు ఒప్పుకొని పిమ్మట మాటతప్పెను. అది గాంధీజీతండ్రి పూర్వము దివానుగా పనిచేసిన సంస్థానము. అందుచే ఆయన ఆ రాజునకు హృదయ పరివర్తనము గావించునిమిత్తము ఉపవాసముచేసెను. అది దేశమంతట వెంటనే

అలజడి కలిగించెను. చివరకు ఆ రాజకోట రాజు గాంధీజీ యాశయమునకు మెచ్చుకొని, వల్లభాయి పటేలుగారు అంతకు పూర్వమే యొసగిన ప్రణాళికను ఆమోదించెను.

దానితో తక్కిన సంస్థానములలోకూడ ప్రజోద్యమము యెక్కువగ బలపడసాగెను. ఇంతలో ఐరోపా ఖండములో బ్రిటన్ జర్మనీలమధ్య యుద్ధము ప్రారంభమయ్యెను. అప్పుడు బ్రిటీషు ప్రభుత్వము కాంగ్రెసు మంత్రివర్గముల సమ్మతినైన గైకొనకయే భారతీయ యోధులనుకూడ యుద్ధమున కంపెను. అంతట తమ నిరసనమును దెలుపుచు యేడు రాష్ట్రములలోని కాంగ్రెసు మంత్రులు తమ పదవులకు రాజీనామానిచ్చి బయటికి వచ్చివేసిరి. అప్పటి సందర్భమును గ్రహించి గాంధీజీ వ్యక్తిసత్యాగ్రహమును మాత్రమే చేయు డని ఆజ్ఞాపించెను. ఆవిధముగకూడ వేలకొలది కాంగ్రెసు వాదులు చెరల కంపబడిరి. కాని 1940 లో విడుదల చేయబడిరి.

తదుపరి జపానువారి విజృంభణము నరికట్టుటకు కాంగ్రెసు మంత్రివర్గమును నియమింప సర్. స్టాఫర్డుక్రిప్సు ఇంగ్లాండునుండి రాయబారిగ యిచ్చటికి పంపబడెను. కాని ఆయన తెచ్చిన షరతులు తృప్తికరముగ నుండనందున కాంగ్రెసువారు సమ్మతింపలేదు. ఈ వ్యవహారముల కన్నింటికిని గాంధీజీయే ప్రధాన పురుషుడై కాంగ్రెసును నడిపించు చుండెను. తక్కిన మహానాయకులెల్లరు ఆయన సలహాలకు జోహారు లొసగుచు ఆయన మహోన్నత నాయకత్వమును పలువిధముల పొగడుచుండిరి. అప్పటికి సుబాస్ చంద్రబోసు దేశమునుండి తప్పించుకొనిపోయి "అజాద్ హింద్

ఫౌజ్" అను నొకపెద్ద సైన్యమును మలయా బర్మాలలో తయారు చేసి, జపాన్‌వారి సహాయముతో అస్సాం, మణిపూరులపై దాడి వెడలెను. కాని అది ఫలింపలేదు. 1942 ఆగష్టునాటికి బ్రిటీషువారి శతృవుల విజృంభణము అన్నిరంగములలోను తగ్గిపోయెను. దానితో బ్రిటీషువారు భారతీయులకు స్వాతంత్ర్య మిచ్చుటకు మారుగ వారిని నిర్వీర్యుల చేయసాగిరి. అదిచూచి భరింపలేక గాంధీజీ దేశమునందలి కాంగ్రెసు సంస్థలచేత "బ్రిటీషువారు ఈ దేశమునువదలి పోవలెను" అను తీర్మానమును చేయించెను. దానితో మరల అరెస్టులు ప్రారంభ మయ్యెను. అప్పుడు సత్యాగ్రహమును నడుపు భారమంతయు గాంధీజీపైననే యుంచబడెను.

అంతట ఆయనకూడ అరెస్టుచేయబడి పూనాదగ్గర ఆగాఖాన్ భవనములో ఉంచబడెను. ఆయన సతీరత్నమును లోకమాతయు నగు "కస్తూరిబాయి" **22-2-44** లో జైలులోనే జబ్బుపడి స్వర్గస్థురాలయ్యెను. తన జీవితకాలమంతయు భర్తతోపాటు దేశ సేవచేసి ప్రాణములర్పించిన ఆమె వియోగమునకు దేశమంతయు ఎట్లు శోకింపకుండును? ఇంతలో ధరలు విపరీతముగ పెరిగి క్షామ దేవత దేశమంతట తాండవమాడ సాగెను. గాంధీజీ 1944 లోను, కాంగ్రెసు సభ్యులు 1945 లోను, విడుదల చేయబడిరి. కస్తూరి బాయి స్మారకనిధి నొకదాని నారంభింపగా దేశము అనతికాలము లోనే **120** లక్షల రూపాయలు సమర్పించెను. ఎంతగొప్ప ధనము! ఎంతసులభముగ ప్రజలనుండి వసూలైనది! ఆ ధనమంతయు స్త్రీ ప్రసూతిచికిత్సాలయములకు, స్త్రీ విద్యాలయములకు, విరాళములుగ

వినియోగింపబడెను. కాని రాను రాను క్షామ మెక్కువయై ముఖ్యముగ బెంగాలు రాష్ట్రములో నెక్కువగ విజృంభింపజొచ్చెను. ఏమని చెప్పవలెను ఆ ఘోరదృశ్యమును! ఎచ్చట చూచినను

సీ॥ భరియింపరాని నిర్భర బుభుక్షాబాధ
మేనులెండియు నేడ్చుదీను లొకట।
గట్టులై పుట్ట యాకలి లేదుగదయంచు
చెట్టునీడల బ్రుంగు జీవులొకట।
ఆకులలములైన నమృతంబుగానెంచి
కొనయ్యూపిరిని మూల్గు జనములొకట।
మానాభిమాన ధర్మజ్యోతి విడలేక
లోలోన గ్రుంగు సచ్చీలు రొకట।
గీ॥ కలగుచును దైవభజనంబు సలుపుటొకట।
ఎటుగనిన దైన్యముట్టిపడుటయెగాని।
కటకటా! యెందు నీషద్వికాసమేని
పొరయరాదయ్యొ పృథులజీమూతవితతి॥

వ॥ మరియు,

ఉ॥ మాసినవస్త్రముల్ విడచి మంచివి దాల్చెదరన్ననేవి? బల్
గాసిలి మానమేక్రియనొ కాచుకొనన్ మతిప్రాణమెట్టు లీ
వేసటచాలదే? చెలగి భీకరరుగ్వ్యథలెన్నొ వారిపై
రోసముజూపగావలెనె! రోయరె పాపము వారు లోకమున్!

వ॥ గాంధీజీ అట్టివిచూచి ఎట్లూరకుండగలడు? అందుచే వెంటనే ఆయన అచ్చటికేగి ఆ క్షామమును పోగొట్టుటకు కొన్ని నిర్మాణాత్మకమార్గములను సూచించెను. పిమ్మట 1946 జనవరిలో

ఆయన మద్రాసులో హిందీప్రచారసభవారి రజతజయంత్యుత్సవము నకు అధ్యక్షతవహించి, విజయవాడలో ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార భవన నిర్మాణమును ఆశీర్వదించి, మరల తన యథాస్థానమగు "వార్ధా" ఆశ్రమమునకు వెడలిపోయెను. ప్రతిసంవత్సరమును ఆయన జన్మదినోత్సవములు దేశమంతట అతివైభవముతో జరుప బడుచుండెను. ఆయనను కీర్తించుచు జరుపబడిన సభలకుగాని, రచింపబడిన గ్రంథరాజములకుగాని, ప్రతిష్ఠింపబడిన శిలావిగ్రహము లకుగాని లెక్కయే లేదు. ఎచ్చట చూచినను ప్రజలు

గేయము — తాళం: ఆది

(ఇందిరా ప్రభో ... ... ... వలె)

ప॥ సద్గుణాంబుధీ! గాంధీ! సద్గుణాంబుధీ! గాంధీ!

చ. 1. సత్యపాలనా ప్రవీణా! సాధుపోషణాధురీణా!
శాంతిసంగర ప్రమాణా! సద్గుణాంబుధీ! గాంధీ!

2. భారతస్వరాజ్యనేతా! భవ్యజీవనవిధాత!
సకలలోకసౌఖ్యదాత! సద్గుణాంబుధీ! గాంధీ!

3. నీదుమహిమ సెన్నతరమా! నీఋణంబు దీర్చతరమా!
లోకనేత నీవేకావే! సద్గుణాంబుధీ! గాంధీ!

4. సకలమానవాళికైన, సకలధర్మపాళికైన,
ఆత్మవివేకావే గాంధీ! సద్గుణాంబుధీ! గాంధీ!

వ॥ అని అత్యంత భక్తి గౌరవములతో స్తోత్రము చేయసాగిరి.



శ్రీరస్తు

# ★ బాపూజీ ★

★

## నాలుగవ ప్రకరణము

పిమ్మట 1945 అక్టోబరులో కేంద్రసభకును, 1946 ఫిబ్రవరిలో రాష్ట్రసభలకును ఎన్నికలు జరుపబడెను. తత్ఫలితముగ బెంగాలు రాష్ట్రములోను, సింధురాష్ట్రములోను, ముస్లింలీగు ప్రభుత్వమేర్పడెను. ఎనిమిది రాష్ట్రములలో కాంగ్రెసు ప్రభుత్వము నెలకొనెను. పంజాబులోమాత్రము మిశ్రమ మంత్రివర్గము కలిగెను.

పిమ్మట బ్రిటీషు కార్మికప్రభుత్వము ఇంగ్లాండునుంచి ముగ్గురు నాయకులను రాయబారులుగ నంపెను. కేంద్రప్రభుత్వ మంత్రి వర్గములో ముస్లిములుకూడ నుండవలయునని గాంధీజీ వాదించెను. అట్లుండరాదని ముస్లిములీగు నాయకుడగు జిన్నాగారు వాదించెను. ఆ నాయకత్రయ యత్నఫలితముగ పండిత జవహర్లాల్ నెహూరు ప్రధాన మంత్రిత్వమున కేంద్రమంత్రి వర్గమేర్పడెను. కాని అందులో చేరుటకు ముస్లిములీగువారు నిరాకరించిరి. అందుచే వారి స్థానములలో స్వతంత్ర ముస్లిములు చేర్చబడిరి. కాని పిమ్మట వైస్రాయియగు వేవెల్ ప్రభువు యత్నమున ముస్లిం లీగు ప్రతినిధులు స్వతంత్ర ముస్లిముల స్థానములలో నియమింపబడిరి. దానితో ఆ మంత్రివర్గమున అనైక్యమేర్పడెను. 16–8–46 నుండి ముస్లిములీగువారు కాంగ్రెసు ప్రభుత్వముమీాద ప్రత్యక్షయుద్ధము నారంభించిరి. కలకత్తాలోను, తూర్పు బెంగాలులోని నవఖాళీ

జిల్లాలోను వేలకొలది జనులు దోచుకొనబడిరి. వేలకొలది చంపబడిరి. స్త్రీలు అపహరింపబడిరి. ఆ ఘోర విషాదవార్తలను విని భారతదేశమంతయు తల్లడిల్లిపోయెను. నాయకులు దేశమంత టనుచేరి శాంతినెలకొల్పుటకై

మ॥ తగునే మీరిటు లన్యదేశజుల ప్రోత్సాహంబుచే నుగ్రులై
పగసాధింపఁదలంచి దేశజనులన్ బాధింపగాఁ బూనుటల్?
జగతిన్ మానవజాతి యోగ్యమగు నాశాంతంపు పెన్ద్రోవ త్రొ
క్కఁగ దివ్యంబగుఁగాదె కోర్కెల పరిష్కారంబు గావింపగన్॥

వ॥ అని పలువిధముల ప్రబోధింపసాగిరి. ఆ కలహముల ఘోరవార్తలు విని గాంధీజీ ఆ ప్రదేశములకు వెళ్ళెను. ఈ లోన బెంగాలు కాందిశీకులు కొందఱు బీహారు చేరి అచ్చటనున్న వారిని హింసింపసాగిరి. అప్పుడు ఆ హింసలు మాననిచో తాను ఉపవాసము చేయుదునని గాంధీజీ బీహారువాసులకు తెలియజేసెను. ఈ విధముగ గాంధీజీ మతాంతరుల యోగక్షేమముల గూర్చి కూడ గొప్ప అభిమానమును జూపెను. అంతట గాంధీజీ అగ్నిగుండమువలె చెలరేగిన నవఖాళీ, త్రిప్పెర జిల్లాలలో ప్రతి గ్రామమునకు వెళ్ళి, ప్రజలలో మతసామరస్యము కలిగింపసాగెను. ఆయన ఆ జిల్లాలలో కాలినడకను పోవుచుండగా ఆయన ధైర్యోత్సాహములకు లోక మంతయు నబ్బురపడెను. అచ్చట ఆయనపై ఒక యీగయైన వ్రాలలేదు. అంతట ఆయన బీహారులోని జనులకు స్థిరనివాసములు కలిగింప నేరెను.

అదియట్లుండ 1949 మార్చిలో పండిత నెహ్రూ మున్నగు వారి కృషిచే ఆసియాఖండ మహాసభ ఢిల్లీలో జరుపబడెను. దాని

యుద్దేశమేమన, ఆసియాఖండములోనున్న అన్ని దేశములమధ్య ఐకమత్యమును సాధించుట. బీహారులో శాంతిస్థాపనకై కృషి చేయుచున్న గాంధీజీ ఆహ్వానముపై ఆ సభకు వచ్చి

సీ॥ పెంపారుగాక పృథ్వీ మానవులయందు
పరదేశ సహకార భావగరిమ।
శమియించుగాక విశ్వంబెల్ల వేధించు
రాజ్యాధిపతుల సామ్రాజ్య కాంక్ష।
జ్వలియించుగాక పూజ్యుల కార్యధీరత్వ
మసహాయ జనుల మానసము లలర।
వ్యాపించుగాక సత్యాహింస లనయంబు
జీవిత సుఖము రంజిల్లునట్లు।

గీ॥ ధరణిలో జ్ఞానసంపద వరలుగాక।
ఐక్యభావంబు నిండార నలరుగాక।
ఆయురారోగ్య భోగభాగ్యా న్వితముగ।
జగము సౌఖ్యపథంబున నెగడుగాక!

వ॥ అని బోధించెను. పిమ్మట 20—2—47 తారీఖున బ్రిటిషువారు యీ దేశమును 1948 జూన్ నాటికి విడచిపోయెద మని ప్రకటించిరి. మరియు, తాము వెడలిపోవునపుడు కేంద్ర ప్రభుత్వముననే కాక, రాష్ట్రములలో కూడ నెవరి కెక్కువ ప్రాముఖ్యముండునో వారికి అధికారము నప్పగించి పోయెదమని ప్రకటించిరి. ఇఁక చెప్పవలయునా? దానితో ప్రాబల్యము కొఱకు పంజాబు రాష్ట్రములోను, సరిహద్దు రాష్ట్రములోను మతసంఘముల

సంఘర్షణమెక్కువయ్యెను. జన, ధన, మాననష్టముల కంతేలేక పోయెను. అందుచే దేశమును పాకిస్తాను ప్రణాళిక చొప్పున విభజించిననేగాని శాంతి నెలకొనదని సిక్కులు ప్రభుత్వ మంత్రి వర్గమునకు విన్నవించిరి.

అప్పుడు క్రొత్తగా వచ్చిన వైస్రాయి మౌంటుబ్యాటను ఆ సమస్యను పరిష్కరింపఁ జూచెను. దేశ విభజనను శాసన సభ్యులు నిర్ణయించుదనుక తాత్కాలిక కేంద్రప్రభుత్వమేయుండ వలయుననియు, విభజనమైన వెనుక వేఱు కేంద్ర ప్రభుత్వము లుండవలయుననియు నిర్ణయింపఁబడెను. ఈ ప్రణాళికను సర్వపక్ష నాయకులు ఆమోదించిరి. కాని అఖండ భారతభాగ్య తపస్వియగు గాంధీజీకి మాత్రము అది యిష్టము లేకుండెను. అయినను యితరులఅభిప్రాయమునకు ఆయన కూడ తలయొగ్గెను.

తే॥ అంతట భారత దేశ విభజనం బెంతయు వేగమె జరిగెఁ।
పంతమలర కేంద్రప్రభుత్వములు వరలె నుభయరాజ్యములఁ॥
పాకిస్తాన్‌లో జిన్నాసాహెబ్ వైస్రాయిగ విలసిల్లెన్।
ప్రాకటముగ మనఇండియాకు మౌంట్‌బ్యాటను వర్యుండుండెఁ॥
గాంధీగారికి విభజన మెంతయు కష్టమయముగానున్నఁ।
బంధుభావమున రెండు దేశములు వరలుడటంచును గోరెఁ॥

వ॥ ఇండియాలో నేర్పడిన కేంద్ర మంత్రి వర్గములో గాంధీజీ కాంగ్రెసు సభ్యులు కానివారినికూడ కొందఱిని జేర్పించి, తద్వారా తన యుదార హృదయమును వెల్లడించెను. ఆయన మాత్రము యే పదవిని స్వీకరింపక నిష్కామ సేవ చేయుచుండెను.

1947 ఆగష్టు 15 నుండి ఇండియన్ యూనియన్‌లో స్వరాజ్యోదయ మయ్యెను. దేశమంతటను ఉత్సవములు మహా వైభవముతో జరుపబడుచుండెను. ఎచ్చట చూచినను ప్రజలు ఉత్సాహముతో

రాగం : శంకరాభరణం గేయము తాళం : ఆది

జయజై! జయజై! భారతమాత!
జయము గొనుము మా మంగళ చరిత! ॥ జ ॥
బుధజన వినుత, సుజన ప్రపూత
సదమలనేత, సాహసభరిత
స్వాగత మిదుగో, సరగున గొనుమా
సానందముగా, సన్నుతి గొనుమా ॥ ॥ జ ॥
సురుచిర వాహిని, సుందర వేణి,
వరమృదు మధుర మనోహర వాణి,
సకల సుఫల సుమ సంచయ శ్రేణి,
ప్రకటిత వితరణ శోభిత పాణి ॥ ॥ జ ॥
స్వతంత్ర భారత భూమీ
సర్వదేశ సుఖ కామీ
శాంతి ధర్మ పథ గామీ
వందిత మోహన భూమీ ॥ ॥ జ ॥
మాతా మముదయ బ్రోవగదమ్మా,
కోపతాపముల మానుదు మమ్మా,
సర్వతోముఖాభ్యుదయము నిమ్మా,
అమ్మా దీవన లిమ్మా రమ్మా ॥ ॥ జ ॥

వ॥ అని గానము చేయసాగిరి. కాని అప్పుడు గాంధీజీ ఆ ఆనందోత్సవములలో పాల్గొనెనా? లేదు. అప్పుడు మత కలహములలో జిక్కిన కలకత్తాకు పోయి అచ్చట శాంతిస్థాపనకై పాటుపడుచుండెను.

దేశవిభజనతో శాంతి యేర్పడునని యెల్లరు ఆశించిరి. కాని అట్లు జరుగలేదు. పాకిస్థాన్‌లోని దుండగములను విని, ఢిల్లీలోనివారు యుద్రిక్తులై మతాంతరులపై హింసాకృత్యములు చేయసాగిరి. అప్పుడు గాంధీజీ ఢిల్లీకి పోయి అచ్చట శాంతి నెలకొనునట్లు చాల కృషి చేసెను. సాయంకాలమునందు సర్వమత ప్రార్థనలుచేసి మతసామరస్యమునుగూర్చి బోధించెను. కాని దానికి ప్రతిఫలముగ పాకిస్థానులో శాంతి యేర్పడలేదు. ఆవార్తలువిని ఢిల్లీలోని జనులు విజృంభించిరి. అట్టివిజృంభణమును నిరసించుచు ఆత్మపరిశుద్ధికని గాంధీజీ 12–1–48 నాడు ఉపవాసము నారంభించెను. మత సామరస్యముకొఱకు ఆయన యేడు షరతులు కోరెను. అన్ని మతముల ప్రతినిధులు త్వరితముగ జేరి గాంధీజీ యొద్ద ఆ షరతుల నమలు జరుపుటకు సమ్మతించిరి. అప్పుడు ఆయన ఆరవ దినమున ఉపవాసమును మానుకొనెను. అయితే పై యేడు షరతులన్నియు మహమ్మదీయుల కనుకూలముగనున్నవని గాంధీజీపై కొందఱికి అసంతృప్తి కలిగెను. ఆ అసంతృప్తిని పాటింపక ఆయన ఢిల్లీలో తానున్న బిర్లాభవనపు ఆవరణములో ప్రతిసాయంకాలమున మతసామరస్యము కొఱకు ప్రార్థనలు సలుపుచుండెను. ఆయన అచ్చట భగవద్గీత, కొరాను, బైబులు మున్నగు మతగ్రంథముల లోని భాగములు చదువుచుండెను. మఱియు ఆయన

## గేయము

ప॥ రఘుపతి రాఘవ రాజారాం, పతితపావన సీతారాం।

చ॥ 1. ఈశ్వర అల్లా తేరేనాం సబుకో సన్మతి దేవ్ భగవాన్ ॥ర॥

2. సుందర విగ్రహ మేఘశ్యాం, గంగా తులసీ సాలగ్రాం ॥ర॥

వ॥ అని భక్తి పూర్వకముగ లోకైక దైవమును ప్రార్థించుచు యితరులకు బోధించుచుండెను. ప్రపంచములోని మతములన్నియు మానవజాతిని ఐక్యము చేయుటకే యున్నవికాని భేదభావములు కలిగించుటకుకాదని ఆయన కంఠమెత్తి ఉద్ఘాటించు చుండెను.

ఇట్లు ప్రతిదినము జరుగుచుండగా 20–1–48 తారీకున ఆయన సభలో ప్రార్థనోపన్యాసము చేయుచుండు సమయమున ఆయనకు కొంచెము దూరములో ఒక బాంబు ప్రేలెను. కాని యెవరికిని ప్రమాదము కలుగలేదు. ఆ బాంబు వేసిన మదన్‌లాల్ అను నాతడు తనకై వేచియున్న కారులో యెక్కుటకు పరుగిడు చుండగా పట్టుకొనఁబడెను. అప్పటి నుండి గాంధీజీ ప్రత్యేక రక్షణకై ప్రభుత్వముచే పోలీసు లేర్పాటు చేయబడిరి. ఢిల్లీలో చాలమటుకు శాంతి నెలకొనుటచే గాంధీజీ కొద్ది దినములలో పంజాబుకు శాంతిస్థాపన కొఱకే వెడలదలఁచి, అనుమతికై పాకిస్థాను ప్రభుత్వమునకు వ్రాసి, జవాబుకై యెదురు చూచు చుండెను. అప్పటికి జవాబు రాకుండుటచే, అది వచ్చు లోపల ఆయన వార్ధాలో తనకై వేచియున్న నిర్మాణ కార్యకర్తల సమావేశమునకు ఫిబ్రవరి 2 వ తేదీన వెడలదలచెను.

కాని ఆ పరాత్పరుని సంకల్పము కూడ నట్లే యుండెనా? లేదు. ఆ జగత్పాలకుని సంకల్పమునకు వికల్ప మెక్కడిది? 30-1-48 వ తారీకున ప్రపంచమున కంతటికిని ఆ పరాత్పరుడు ఒక గొప్ప విషాద సంఘటనమును సిద్ధముచేసి యుంచెను. అట్లు జరుగునని లోకము కలలోనైన భావింపలేదు. ఆనాటి సాయంకాల మున మామూలు ప్రకారము బిర్లా భవనపు ఆవరణములో సరిగా 5 గం. 10 ని. లకు గాంధీజీ ప్రార్థన స్థలమునకు వచ్చి వేదిక నెక్కుచుండెను. ఆయన కిరుప్రక్కల తన మనుమరాండ్రు నడచుచుండిరి. అప్పుడు ఆ సభలో కాకీ దుస్తులతో నున్న ఒక యువకుడు 'మీరు ఆలస్యముగ వచ్చినారే?' అని యడిగెను. 'అవును' అని గాంధీజీ చిఱునవ్వుతో నమస్కారము చేసెను. అంతలో ఆ యువకుడు వంగి, జేబు నుండి రివాల్వరు తీసి, వెంటనే వరుసగా నాలుగుసార్లు ఆయనపై ప్రేల్చెను. పాపము! రెండు గుండ్లు ఆ మహనీయుని కడుపులో దూరెను. ఒకటి హృదయమునకు తగిలెను. వెంటనే 'హేరామ్! హేరామ్!' అనుచు ఆయన చేతులు జోడించి క్రిందపడెను. ఇంతలో ప్రార్థనకు వచ్చిన జనులు ఆయనను బిర్లా భవనమునకు మెత్తుకొని పోయిరి. 5గం. 35 ని లకు ఆయన నిర్యాణము నొందెను. హంతకుడగు నథూరామ్‌గాడ్సే వెంటనే అరెస్టు చేయబడెను.

ఆ ఘోర విషాద వార్త రేడియో ద్వారా కనురెప్పపాటులో ప్రపంచమంతట వ్యాపించెను. ప్రపంచమంతయు ఆ వార్త విని కొంచెము సేపు ప్రాణహీనమైనట్లయ్యెను. వెంటనే ఇండియన్ యూనియన్ కేంద్ర మంత్రులగు పండిత నెహ్రూ, సర్దార్ పటేల్

మున్నగు వారును, ముస్లిం నాయకులును, తండోపతండములగు ప్రజలును, యితరరాజకీయ ప్రముఖులును బిర్లాభవనమునకు వచ్చిరి. గాంధీజీ సుఖనిద్ర పోవుచున్నట్లు కన్పట్టెను గాని ఆయన ప్రశాంతమైన ముఖతేజము, ఆ దేహపు నిగనిగలు ఏ మాత్రమును తగ్గలేదు. ఆయన తన జీవితములో యెన్నెన్ని ప్రాణగండపు సన్నివేశముల నుండి స్మితవదనముతో వెలువడినాడు? అట్టి మహనీయు డీ విధముగ అకస్మాన్నిర్యాణము చెందునని యెవ్వరైన కలలోనైన తలంపగలరా? బిర్లా భవనములో బందోబస్తునకు మాత్రము గాంధీజీ యొప్పుకొనెను. కాని ప్రార్థన స్థలమునకు వచ్చువారిని సోదా చేయుట మాత్రము ధర్మముకాదని ఆయన పట్టుపట్టెను. హంతకుడగు గాడ్సే ఆ అవకాశము నుపయోగించుకొని ప్రార్థన స్థలములో ఆ ఘోరకృత్యమును చేసెను.

గాంధీజీ పరమపదించిన రాత్రియంతయు జన సమూహము ఆయన దేహమునకు అంత్యపూజలు గావించిరి. మరుసటి దినము ఒక ప్రత్యేక శకటమునందు ఆయన శరీరము ఉంచబడెను. ఉదయము సరిగా 11 గంటలకు ఆ శకటము బిర్లా భవనము నుండి వెలువడెను. వెంట మౌంట్‌బ్యాటను దంపతులు, పండిత జవహర్‌లాల్ నెహూరు, సర్దార్ పటేల్, బాబురాజేంద్రప్రసాద్, అజాద్, మున్నగు అసంఖ్యాకులగు నాయకులు అనుసరించిరి. ఎడతెగని పుష్పవర్షము ఆయనపై కురిపింపబడుచుండెను. ఢిల్లీనగరమంతయు

వచ్చినదా యన్నట్లు పది లక్షల జనము వెంట వచ్చుచుండిరి. అట్టి అపూర్వ రాజకీయమగు హోదాతో ఆ శకటము వీధులవెంట తీసికొని పోబడి, సాయంత్రము 4 గంటలకు యమునా తీరపు రాజఘాటునందు చేర్పబడెను. గాంధీజీ ప్రియపుత్రులగు దేవదాసు గాంధి, రామదాసుగాంధి ఆయనకు అంత్యక్రియలు జరిపిరి. ఆయన భస్మము దేశములోని పుణ్యనదులన్నిటియందును కలుపబడెను.

ఆయన నిర్యాణమునకు శోక శూచకముగ ఇండియా ప్రభుత్వము, పాకిస్తాన్ ప్రభుత్వము, బర్మా సింహళ ప్రభుత్వములు తమ పతాకములను 14 దినములు క్రిందికి దింపిరి. ఐక్యజాతిసమితి వారును, న్యూయార్కులోని సర్వజాతి పతాకము నల్లే దించిరి. వేయేల? ప్రపంచములోనున్న నాగరక దేశములన్నియు ఆయన నిర్యాణమునకు సంతాపమును వెలిబుచ్చుచు,

ఉ॥ శ్రీభరతాంబికా చిరవిశిష్టతపః ఫలనవ్య తేజ! లో
కాభరణా! మహాశయ! మహాప్రతిభాన్విత నాయకోత్తమా!
శోభతొలంగ దుఃఖిత వసుంధర నిచ్చటవీడి స్వర్గముం
బ్రాభవ మొప్ప నేగితివె పాపితుపాకికిఁజిక్కి- బాపుజీ!

వ॥ అనియు,

సీ॥ నినువీడి యీధాత్రి కనులు పోయినదయ్యొ
మరల నెవ్విధి దృష్టి వరల గలదు।
నినుబాసి జగమెల్ల వనట జెందినదయ్యొ
మరల సంతసమెట్లు వరల గలదు।

నినుగాన కవని శాంతిని గానలేవయ్యొ
మరల నెప్పుడు శాంతి వరలగలదు।
నినుగోలుపోయి సజ్జనులెల్ల వగచిరి
మరల నిన్నెపుడింక నరయ గలరు ?

గీ॥ అస్తమింపనిదేది నీ వస్తమింప ?
అస్తమించెను సర్వ మీావస్తమింప।
సకల మానవ కళ్యాణ సాధుమూర్తి!
అఖిల సుగుణైకకంధి మహాత్మ గాంధి!

వ॥ అనియు వాపోవ జొచ్చిరి. మఱియు నెందరెందరో రచయితలు నెన్నియో విధముల ఆయనను కీర్తించుచు అసంఖ్యాకములగు గ్రంథములు రచించిరి. ఎందఱెందరో మహానాయకులు ఆయన మహాత్మ్యమును గూర్చి యుపన్యాసము లొసగిరి. జనులు ప్రతి చిన్న గ్రామమునందును ఆయన విగ్రహమును ప్రతిష్ఠించి తమ ఉడుత భక్తిని ప్రకటించిరి. ఆయన స్మారక చిహ్నముగ నియమించుచు పదికోట్ల రూపాయల నిధిని మహా నాయకులు వసూలు చేసిరి. వేయేల? ఆయనకు స్మారకముగ జరుపబడిన గౌరవములు ఒక విధముగానని వర్ణింప తరము కాదు. దేశ దేశాంతరముల వారును, ఖండ ఖండాంతరముల వారును ఆయన ఘనతను నెన్నియో విధముల పొగడుచు, నెన్నెన్నియో విధముల స్మారక చిహ్నములు ప్రతిష్ఠించిరి. అట్టి లోకోత్తర పురుషుని గోల్పోతిమి కదా యని చింతించిరి. అట్టి మహాత్ము

శేఖరుఁడు మఱల మన కెప్పుడు లభింపగలఁడు? ఊరక ఆయన గుణకర్మలను పొగడి, లెక్కలేనన్ని స్మారక చిహ్నములు, స్మారకోత్సవములు జరిపి, తృప్తిపడినంత మాత్రమున చాలునా? ఆయన మహోన్నత సిద్ధాంతముల ననుసరించిన నాడే లోకమున స్థిరమైన శాంతి సౌఖ్యములు కలుగ గలవు, ఆయన దివ్యాత్మకు శాంతి కలుగ గలదు. కావున

ఉ॥ రాజులు గాంధిజీ పథము రమ్యమొనర్తురు గాక! నాయకుల్
రాజిత నీతియుక్తముగ రంజిలు చుందురుగాక! సత్కళా
రాజియు రాజపోషణను రంజిలుగాక! ధరిత్రిలోన వి
భ్రాజిత సర్వసంపదల పాలితు లెల్ల సుఖింతు రెగావుతన్॥

[illegible] 8-10

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః